# ఎలుక చచ్చిపోయింది,

# చీమ విచారంగా ఉంది

ప్యుబ్లో ఇండియన్ కథ





ఎలుక బొచ్చులో ఒక ముడిపడింది.

దానిని కొంచెం లాగింది, కొరికింది, కానీ
అది విడివడలేదు.





“చీమ సహాయం చేస్తుంది,"
అని అది అనుకుని, చీమను
వెదుకుతూ బయలుదేరింది.



వంటగదిలో చీమ గింజలు ఏరుకుంటూ ఉంది.

“నా బొచ్చు ముడిపడింది," చీమతో చెప్పింది ఎలుక.

“వెనక్కి తిరుగు," చీమ అంది.

“నేను ముడి తీసేస్తాను."





కుండలో ఏముందో చూడటానికి
ఎలుక ముందుకి ముందుకి
వంగి తొంగి చూసింది.



"ఆ కుండలో ఏముంది?" ఎలుక
అడిగింది.
పనిలో ఉన్న చీమ దానికి బదులు
చెప్పలేదు.



"ఎలుకా," చీమ అడిగింది,
"నీకు సాయం కావాలా?"
"ఎలుకా," చీమ మళ్లీ అడిగింది,
"నువ్వు బతికే ఉన్నావా?"



"ముడి ఊడిపోయింది," అంది చీమ.
అది ఎలుకని వదిలిపెట్టింది.
ముందుకి ముందుకి వంగుతున్న
ఎలుక "దభేలు" మంటూ కుండలోకి
పడిపోయింది.

తినటంలో మునిగిపోయిన
ఎలుక జవాబు ఇవ్వలేదు.
చీమ అటూ ఇటూ పరిగెత్తి
చివరకు ఏడవటం
మొదలుపెట్టింది.





“నువ్వు ఎందుకు ఏడుస్తున్నావు?"
నీలి రంగు పిట్ట అడిగింది.

“ఎలుక చచ్చిపోయిందని నాకు
విచారంగా ఉంది," చీమ చెప్పింది.
“అందుకే ఏడుస్తున్నాను."
“ఇది విన్న నాకు కూడా విచారంగా
ఉంది," నీలి రంగు పిట్ట అంది.



“నా రెక్కలు రాల్చేస్తాను,"
నీలి రంగు పిట్ట చెప్పింది.





రెక్కలు రాలిపోయిన నీలి రంగు పిట్ట
కానుగ చెట్టు మీదకి పడింది.
"నీ ఈకలు ఏమయ్యాయి?"
కానుగ చెట్టు అడిగింది
"ఎలుక చచ్చిపోయింది,
చీమ విచారంగా ఉంది,
నేను రెక్కలు రాల్చేశాను,"
నీలి రంగు పిట్ట చెప్పింది.



“ఎలుక చచ్చిపోయి,
చీమ విచారంగా ఉండి,
నువ్వు రెక్కలు రాల్చేస్తే
నేను వడిలిపోతాను,"
అంది కానుగ చెట్టు.
అది వడిలిపోయి, చిన్నగా అయ్యింది.







అప్పుడు నీడ కోసమని ఒక గొర్రె
కానుగ చెట్టు దగ్గరకు వచ్చింది. కానీ,
కానుగ చెట్టు దగ్గర నీడే లేదు.
“నువ్వు ఇంత వడిలిపోయి, చిన్నగా
అయ్యావు ఏమిటి?" గొర్రె అడిగింది.



"ఎలుక చచ్చిపోయింది,
చీమ విచారంగా ఉంది,
నీలి రంగు పిట్ట రెక్కలు రాల్చేసింది,
నేను వడిలిపోయాను,"
అని కానుగ చెట్టు చెప్పింది.





“ఎలుక చచ్చిపోయి,
చీమ విచారంగా ఉండి,
నీలి రంగు పిట్ట రెక్కలు రాల్చేసి,
నువ్వు వడిలిపోతే
నేను బక్కగా అయిపోతాను,"
అంది గొర్రె.
అది అలాగే బక్కగా అయిపోయింది.

అప్పుడు గొర్రె నీళ్లు తాగటానికి నది
దగ్గరకు వెళ్లింది.
"గొర్రా, నువ్వు ఇంత సన్నగా
అయిపోయావేమిటి?"
అని నది అడిగింది

"ఎలుక చచ్చిపోయింది,
చీమ విచారంగా ఉంది,
నీలి రంగు పిట్ట రెక్కలు రాల్చేసింది,
చెట్టు వడిలిపోయింది,
నేను చిక్కిపోయాను,"
అంది గొర్రె.



“అలా అయితే నేను కూడా
ఎండిపోతాను," అంది నది.
అది అలాగే ఎండిపోయింది.
అప్పుడు ఒక అమ్మాయి నీళ్ల
కోసం వచ్చింది.
“నువ్వు ఎండిపోయావు ఏమిటి?”
అని ఆమె నదిని అడిగింది.

"ఎలుక చచ్చిపోయింది,
చీమ విచారంగా ఉంది,
నీలి రంగు పిట్ట రెక్కలు రాల్చేసింది,
చెట్టు వడిలిపోయింది,
గొర్రె చిక్కిపోయింది,
నేను ఎండిపోయాను,”
అని చెప్పింది నది.



“అయితే నేను కుండ పగలగొడతాను,"

అంది అమ్మాయి.

ఆమె అలాగే చేసింది.



“నీళ్లు ఏవి?” అని అమ్మాయి వాళ్ల
అమ్మ అడిగింది.
అమ్మాయి ఇలా చెప్పింది,
"ఎలుక చచ్చిపోయింది,
చీమ విచారంగా ఉంది,
నీలి రంగు పిట్ట రెక్కలు రాల్చేసింది,
చెట్టు వడిలిపోయింది,
గొర్రె చిక్కిపోయింది,
నది ఎండిపోయింది,
నేను కుండ పగలగొట్టాను.”





“అయితే నేను నా చెవి రింగులు కాల్చేస్తాను,"
అంది అమ్మాయి వాళ్ల అమ్మ.
ఆమె అలాగే చేసింది.





“నీ చెవి రింగులు ఎందుకు
కాల్చేస్తున్నావు?“
అమ్మ వాళ్ల అన్నయ్య
అడిగాడు.

“ఎలుక చచ్చిపోయింది, అందరూ
విచారంగా ఉన్నారు,"
చెప్పింది అమ్మాయి వాళ్ల అమ్మ.
“అందుకే నేను కూడా నా చెవి రింగులు
కాల్చేస్తున్నాను."

“అయితే నా గుర్రం తోక
కత్తిరించేస్తాను,"
అన్నాడు అన్నయ్య.



అయితే గుర్రం తన తోకని
కత్తిరించనివ్వలేదు.

"నా తోక పొడవుగా, అందంగా ఉంది.
అది ఈగలను తోలటానికి
ఉపయోగపడుతుంది.
దానిని ఎందుకు కత్తిరిస్తున్నావు?"



“ఎలుక చచ్చిపోయిందని నేను విచారంగా ఉన్నాను," అన్నాడు అన్నయ్య.

“అలా అయితే నా తోకను కత్తిరించవచ్చు. కానీ, చచ్చిపోయిన ఎలుకను నువ్వు చూశావా?" అడిగింది గుర్రం.

“లేదు," చెప్పాడు అన్నయ్య.

“కానీ మా చెల్లెలు తన చెవి రింగులు కాల్చేయటం చూశాను."





"చచ్చిపోయిన ఎలుకను నువ్వు చూశావా?" అమ్మాయి వాళ్ల అమ్మని గుర్రం అడిగింది.

“లేదు,” ఆమె చెప్పింది.

“కానీ మా అమ్మాయి ఎండిపోయిన నదిని చూసింది."

గుర్రం నది దగ్గరకి వెళ్లింది.
"చచ్చిపోయిన ఎలుకను నువ్వు
చూశావా?" గుర్రం అడిగింది.
“లేదు," అంది నది,
“కానీ, చిక్కిపోయిన గొర్రెను
చూశాను."





"చచ్చిపోయిన ఎలుకను నువ్వు
చూశావా?“
గొర్రెను గుర్రం అడిగింది.
“లేదు," గొర్రె అంది.
“కానీ, వడిలిపోయిన కానుగ చెట్టును
చూశాను."

గుర్రం చెట్టు దగ్గరకు వెళ్లింది.
"చచ్చిపోయిన ఎలుకను నువ్వు
చూశావా?" గుర్రం అడిగింది.
“లేదు," చెప్పింది చెట్టు.

“కానీ, రెక్కలు రాల్చేసిన
నీలి రంగు పిట్టను చూశాను."



“విచారంతో నేను రెక్కలు రాల్చేశాను,"
చెప్పింది నీలి రంగు పిట్ట.
“అయితే, చచ్చిపోయిన ఎలుకను నువ్వు
చూసి ఉంటావు," అంది గుర్రం.
“లేదు," బదులు ఇచ్చింది నీలి రంగు పిట్ట.
“ఏడుస్తున్న చీమను మాత్రమే చూశాను."







దాంతో చీమను వెతుక్కుంటూ
వెళ్లింది గుర్రం.

గుర్రం కుండలోకి తొంగి చూసింది.
“పిచ్చి చీమ, అది కుండలో చూడ
లేదు," అంది గుర్రం.
“ఆ కారణంగా నా తోకని కత్తిరించేసి
ఉండేవాళ్లు."





గుర్రం నేల మీద పడుకుని తన
తోకని కుండలోకి వదిలింది.



ఆ తోక మీదుగా కుండలోంచి

బయటకు వచ్చింది ఎలుక.





“ఎలుకా," చీమ అరిచింది,

“నువ్వు బతికే ఉన్నావా!"

చీమ సంతోషంతో అటూ, ఇటూ

పరిగెత్తుతూ గింజలు ఏరసాగింది.

“ఎలుక తిరిగి వచ్చింది!"

అరిచింది చీమ.

“మనం విందు చేసుకోవాలి."



పొడవైన, అందమైన గుర్రం తోకలో
ముడులు ఉన్నాయి. చీమ,
ఎలుకా కలిసి వాటిని తీసేశాయి.



నది ఇంతకు ముందు లాగా నిండుగా ప్రవహిస్తోంది, గొర్రె లావుగా అయ్యింది, కానుగ చెట్టు ఎప్పటి లాగా నీడను ఇస్తోంది.



అమ్మాయి వాళ్ల అమ్మ కొత్త కుండ తయారు చేసింది. ఆమె అన్న కొత్త చెవి రింగులు కొని ఇచ్చాడు.







కానీ, ఈకలు తిరిగి పెరిగే దాకా నీలి రంగు పిట్ట చాలా రోజుల పాటు కానుగ చెట్టు మీద ఉండిపోవలసి వచ్చింది.

అయిపోయింది